## ఎప్పుడూ దానం చేయలేదు గదా! నీ గతి యింతే!!

శంబుకవధచేసిన పిమ్మట రాముడు, త్రోవలో ఉన్న అగస్త్యుని ఆశ్రమాన్ని సందర్శించాడు. ఆయన ఎంతో ఆనందపడి తనవద్ద ఉన్న ఒక దివ్యాభరణాన్ని రాముని కీయబోయాడు. క్షత్రియుడు ప్రతిగ్రహణ యోగ్యుడు (దానం తీసికొనేవాడు) కాదని రాముడు వలదన్నాడు. అగస్త్యుడు రామునితో 'రామా! క్షత్రియోచితమైన మాటే మాట్లాడావు. ఒకప్పుడు రాజులేని కాలంలో బ్రహ్మ దిక్పాలురు నలుగురినీ తమతమ ఒక్కొక్క అంశాన్ని ఈయవలసిందిగా ప్రార్థించి వాటితో రాజుని సృష్టించాడు. కాబట్టి నీలో ఇంద్ర- యమ- వరుణ- కుబేరాంశలున్నాయి. ఇంద్రాంశతో' నన్ను తరింపజేయడానికి దీన్ని స్వీకరించు' అనగానే న (ప్రతిగృహ్ణీష్వ భద్రం తే తారణార్థం మమ ప్రభో! తద్రామః ప్రతిజగ్రాహ మునే రాభరణం వరమ్) రాముడు స్వీకరించాడు.

రాముడు తీసికొన్నాక అగస్త్యుడు ఆ ఆభరణం తనకు లభించిన విధాన్ని ఇలా చెప్పాడు. 'ఒకప్పుడు సుదేవుడనే పేరున్న రాజు విదర్భని పాలిస్తూ ఉండేవాడు. ఆయనకి శ్వేతుడు పుట్టాడు. ఆ శ్వేతుడు తన తమ్ముడు సురథునికి రాజ్యాన్నిచ్చి బహుకాలం తపస్సు చేసి బ్రహ్మలోకాన్ని పొందాడు. అయితే బ్రహ్మలోకానికి పోయినా అతనికి ఆకలి దప్పులబాధ పోలేదు. బ్రహ్మను కారణం అడిగితే 'శ్వేతా! చక్కగా సంపాదించుకొని, నీ కడుపు నిండేలా తృప్తిగా తిన్నావు తప్ప 'దానం' అనే మాట జోలికి కూడా నువ్వు పోయి ఉండలేదు. నీ దేహంమీదే నీకు మంచి అభిమానం ఉంది కాబట్టి నీ శరీరాన్నే నీకు నువ్వు తింటే తప్ప ఆ ఆకలి తొలగదు. (స త్వం సుపుష్ట మాహారైః స్వశరీర మనుత్తమం। భక్షయిత్వా మృతరసం తేన తృప్తి ర్భవిష్యతి॥)' అన్నాడు.

అప్పటినుండీ శ్వేతుడు ఒక కొలని దగ్గఱ ఆశ్రమంలోని ఉంటూ ఆకలివేసిన ప్రతిపర్యాయమూ బాగా వాచిన పీనుగుని (తన శరీరాన్నే) తాను తింటూ ఉండిపోయాడు. ఏ రోజూ తిని ఆ మఱునాటికి చూచేసరికి మళ్లీ అంతకు ఎక్కువ శరీరం పెరుగుతూ

ఉంటుంది! ఈ బాధపడలేని శ్వేతుడు ఈ దివ్యాభరణాన్ని నాకిచ్చి తన బాధ తొలగించమనగా నేనా ఆభరణాన్ని స్వీకరించాను. నేను తరించడం కోసం నీకిచ్చాను' అన్నాడు అగస్త్యుడు.

రాముడు చేయవలసిన పనులలో ఈ శ్వేతుణ్ణి అనుగ్రహించడం కూడ ఉండడంబట్టే రాముడు ఈ త్రోవన వచ్చాడని భావించాలి. మహర్షులు తమ తపఃఫలాన్ని ధారపోస్తా మనగానే 'అహమేవాహరిష్యామి స్వయం లోకాన్ మహామునే! ' 'ఓ మునీ! ఆలోకాలని నేనే ధనుస్సుతో తెచ్చుకుంటాను గదా!' అని అన్న అప్పటి రాముడు, నేడు దివ్యాభరణాన్ని గ్రహించడం శ్వేతుణ్ణి తరింపజేయడానికే. సందేహం లేదు. దానం చేయకపోవడం బట్టి శ్వేతునికి ఈ పీనుగు (శవం) రూపం లభించడం ఎంత నికృష్టమో గమనించగలగాలి.

దానవిషయంలో ఇక్ష్వాకు రాజులని చెప్పుకోక తప్పదు. ఎవరి కడుపుకి వారూ, ఇక కన్నవారు ఎవరో వారూ, సుఖంగా భుజిస్తారు. కాని దానం చేయవచ్చేసరికి ఎవరికీ ప్రాణం ఒప్పదు. ధనానికి అనుభవించడం, నాశనంకావడం, దొంగలపాలు చేయడం అనే మూడు దశలున్నాయి. సత్పురుషుడు 'పైజన్మలో ఎక్కడ దరిద్రునిగా పుడతానో' అనే భయంతో దానం చేస్తాడుట. మూర్ఖుడు తానెక్కడ దానాలనిచేసి చేసి దరిద్రుడినైపోతానో అని దానం చేయడుట. (మూర్ఖో న హి దదా త్యర్థం నరో దారిద్ర్యశంకయా - ప్రాజ్ఞ స్తు వితర త్యర్థం నరో దారిద్ర్య శంకయా॥) అశ్వమేధయాగాన్ని చేసి అనేక దానాలనీ చేసి దానాలన్నీ అయిపోయాయన్నాక కూడా ఎవరోవచ్చి దశరథుణ్ణి దానం అడిగారుట. (కస్మైచి ద్యాచమానాయ హస్త మాభరణం దదౌ ) 'ఇప్పుడెలాగ?' అని విసుగుకోకుండా చేతినున్న దివ్యాభరణాన్ని తీసి ఇచ్చాడుట దశరథుడు.

విశ్వజిత్తనే పేరున్న యాగాన్ని చేసి మట్టికుండతో రఘుమహారాజు మిగిలినప్పుడు, కౌత్సుడనే ఒక వరతంతు మహర్షిగారి శిష్యుడు 14 కోట్ల నాణాలని రఘువు నుండి దానంగా తీసికొని తన గురుదక్షిణని చెల్లించుకోగలిగాడు. అరణ్యాలకి పోబోతూన్న రాముడెన్ని యెన్ని దానాలని చేసాడో లెక్కలేదు. చాలు చాలంటూ, తీసికోడానికి

వ్యక్తులే ఇక లేకపోయారట! అంతటి దానపరుడు రాముడు. ఎవరి పోషణని వారు చేసికోవడమే, దానికోసం అహర్నిశలూ శ్రమపడుతూండడమే ఈ 'శరీర కర్తవ్యం' అని భావిస్తే, ఆపనిని కుక్క- ఇంకా అంతకంటె హీనజాతులూ ఎన్నో చేస్తూనే ఉన్నాయి. అవన్నీ కూడ తమతమ శరీరాలని గూర్చిన ఆత్మరక్షణలో అతి జాగ్రత్తగానే ఉంటాయి గదా! అయితే వాటికీ మఱి మనుష్యులకీ భేదం ఏముంది? ఉండితీరాలి సుమా!

తాను (అగస్త్యుడు) శ్వేతుని ప్రార్థనపై ఆ ఆభరణాన్ని గ్రహిస్తూ న్నంతలోనే శ్వేతుడు రోజూ తింటూండే పీనుగు పూర్తిగా కన్పించకుండా పోయిందని రామునితో చెప్పాడు అగస్త్యుడు. కాబట్టి దానం చేయడం వలన పూర్వజన్మకి విష్కృతి కూడా కల్గవచ్చన్న మాట. ఈ సందర్భంలోనే అగస్త్యుడు దండకారణ్యం ఏర్పడిన విధంకూడ చెప్పాడు.

మనువుకి పుత్రుడైన ఇక్ష్వాకు మహారాజుకి పుట్టిన నూఱుగురు పిల్లల లోనూ చివరివాడు దండుడు. మిగిలిన వారంతా ధర్మపరులైతే ఇతడొక్కడే నీతిలేక ఉన్నాడు. ఇలాంటి గర్విష్ఠి ఎవరి వలనో దండితుడౌతాడని గమనించి వానికి 'దండుడు' అనే పేరుని తండ్రి పెట్టాడు. దుర్మార్గుడైన దండుడు శుక్రాచార్యుని కూతురు 'అరజ' కన్యాత్వాన్ని భంగం చేసిన కారణంగా శుక్రుడు దండుణ్ణీ అతని దేశాన్నీ శపించాడు. ఫలితంగా దండుడు తనవారితో మాడి మసి అయిపోయాడు. అతని దేశంలో 7 రోజులపాటు దుమ్ము వానగా కురిసి (మట్టివాన) దేశం ఎందుకూ ప్రయోజనం లేకుండా పోయింది. ఆ నాటి నుండే 'దండక' అనే పేరు వాడుకలోకి వచ్చింది. ఎవరూరాని ఆ చోటు తపస్సుకి అనుకూలం కదా! అనే భావనతో మహర్షులు వచ్చి తపస్సులు ప్రారంభిస్తే ఇది 'జనస్థానం' (మహర్షి జన నివాసస్థానం) అయింది. (సమంతా ద్యోజనశతం విషయం చాస్య దుర్మతేః। ధక్ష్యతే పాంసువర్షేణ మహతా పాకశాసనః ।।)

అయోధ్య నుండి బయలుదేరి సీతారామలక్ష్మణులు చేరినది ఇక్కడికే. ఆ దండక పూర్వకథ ఎక్కడ దొరుకుతుంది? అంటే దానికి ఉత్తరం (సమాధానం) ఈ కాండలో ఉంటుంది. ఇక్కడ మహర్షులు

ఎక్కువగా ఉండడంతో ఇక్కడే రాక్షసుల బలగాలని ఎక్కువచేసి ఎందఱో మహర్షులని వధించి 'జనస్థానం' రాక్షసులకి ఆటపట్టు (రాక్షస జనస్థానం) అనే వాడుక వచ్చేలా రావణుడు చేసాడు. ఆ జనస్థానానికే రాముడు వచ్చి ఖరదూషణ త్రిశిరవధని చేసాడు. ఒక దృష్టితో ఆలోచిస్తే ఒక గ్రంథం వెనుక వేయబడిన టిప్పణి ( Glossary) వంటిది శ్రీమద్రామాయణానికి ఉత్తరకాండం.

అగస్త్యునివద్ద సెలవుతీసికొని అయోధ్యకు వచ్చి రాజసూయం చేద్దామనే కోరికని వెలిబుచ్చాడు రాముడు. అవతారం ముగింపుకి రాబోతోంది కాబట్టీ, ముందు నాటికి భరతుని రాజఱికంలో కుశీలవుల యౌవరాజ్యం సాగబోతోంది కాబట్టీ, రాజ్యాన్ని నిష్కంటకం (దుర్మార్గ రాజులు లేకుండా చేయడం చేయాలి కాబట్టి, 'రాజసూయాన్ని చేద్దాం' అన్నాడు. విషయాన్ని గ్రహించిన భరతుడు 'రాజులవధ మాత్రమే ప్రధాన లక్ష్యంగా ఉండే రాజసూయం వలదు' అని సూచించాడు. రామచంద్రుడు సరేనని అంగీకరించాడు. అన్న చెప్పినది వినడమే లక్ష్యంగా ఉన్న భరతుడు 'వద్దని' సూచించడానికీ, రాముడు కూడా భరతునిగూర్చి అన్యథా ఆలోచించక పోవడానికీ కారణం ఒకటే. ముందునాటికి రాజఱికం భరతునిదే. అతడే చూచుకోవాలి రాజ్యపు బాగోగులని.

ఎంతకాలమూ తాను మాత్రమే సూచిస్తూంటే అతని పరిపాలనం ఇక ఎప్పుడు? అతనికతడు నిర్ణయాన్ని తీసికొనే అవకాశాన్నీయాలనీ, తిరిగి అతని రాజఱికపు ముగింపులో అతడు (భరతుడే) కుశీలవులకి కూడా ఈ విధానాన్నినేర్పి వారిద్దఱినీ ప్రయోజకులని చేయాలని కూడా రాముని భావమన్న మాట. 'భరతా! లోకానికి కష్టాన్ని కల్గించే ఏ పనినైనా రాజు చేయరాదు కదా! మంచిమాట అయినట్లైతే బాలుడు చెప్పినదానినైనా (వయసు-అనుభవం చేత చిన్నవాడు) వినాలి కాబట్టి నీ మాట తప్పక ంటున్నాను' అని రాముడు అనిన మాటలని గమనించాలి.
ోకపీడాకరం కర్మ న కర్తవ్యం విచక్షణైః। బాలానాం తు శుభం లాక్యం గ్రాహ్యం లక్ష్మణపూర్వజ! తస్మా చ్ఛృణోమి తే వాక్యం సాధు యుక్తం మహామతే!)

## అశ్వమేధాన్ని చేస్తే బాగుంటుందేమో!

రాజసూయం వద్దని భరతుడు ప్రతిపాదించగానే అంగీకరించిన రాముడు, అశ్వమేధం చేస్తే మంచిదనే లక్ష్మణుని అభిప్రాయాన్ని వినాలని ఆసక్తి చూపించాడు. లక్ష్మణుడు ప్రారంభించాడు.

అన్నా! భయంకరాకారం కల వృత్రుడనే పేరున్న రాక్షసుడు ముల్లోకాలనీ ధర్మబద్ధంగా పాలించాడు. అతని ధర్మం కారణంగా భూమి వర్షాన్నీ - సేద్యాన్నీ కూడా చూడకుండా పంటలని సమృద్ధిగా ఇచ్చింది. ప్రజలకి 'దారిద్ర్యం' అనేమాట ఒకటుందనే విషయం కూడా తెలియక పోయింది అతని పరిపాలనలో. తన పెద్దకొడుకుని మధురకి రాజుగా చేసి అడవిలో భయంకర తపస్సు ప్రారంభించాడు వృత్రుడు. ఇంత ధర్మబద్ధంగా పరిపాలిస్తూన్నా దేవతావిరోధం వానికి పోలేదు. సహజంగా రాక్షసుడైన కారణంగా దేవతలంటే గిట్టనితనం అతనితో నిలిచిపోయింది. పైగా బ్రాహ్మణ వంశానికి చెందిన వృ క్షత్రియుడు మాత్రమే చేయవలసిన పరిపాలనకి అర్హుడు కాకపో ఈ రెండు కారణాలతో, అతడే తపస్సులో మెప్పించి వ పొందినట్లైతే, లోకానికీ, దేవగణానికీ కూడా ముప్పు వాటిల్లగ భావించిన ఇంద్రుడు, విష్ణువుతో మొఱపెట్టుకుని వృత్రుణ్ణి వధి తప్పదని ప్రార్థించాడు.

సుఖంగా పరిపాలనాన్ని చేస్తూన్న వృత్రుణ్ణి వధించడ ధర్మబద్ధ మౌతుందా? అని సందేహం కల్గుతుంది. పరిపాలన విషయంలో సక్రమంగా ఉన్నా దైవమంటే గిట్టనితనం సరికాదు. వర్షాలకి అధిదేవత ఇంద్రుడు. ఆయన కృపవలన వర్షాలు కురిస్తే పంటలు పండి సస్యశ్యామల మౌతుంది భూమి. ఆ ఇంద్రుడు దేవతల కధ్యక్షుడు. దేవతలతో విరోధించడమంటే చేసిన వర్షసహాయానికి కృతజ్ఞతని చూపక కృతఘ్నతని ప్రదర్శించడమే ఔతుంది. అందుకని వృత్రుడు వధ్యుడే (వధింపబడ దగిన వాడే). ఇక రెండవది బ్రాహ్మణునికి క్షత్రియధర్మం సరికాదు. పరశురాముడు క్షత్రియ ధర్మాన్ని అవలంబించిన కారణంగానే రాముని శిక్షకి పాత్రుడై బ్రాహ్మణునిగా తానార్జించిన తపోలోకాలని కోల్పోవలసి వచ్చాడు.

ఇక్కడ కూడా అంతే. ఇక రావణుడు బ్రహ్మరాక్షసుడనే వాదం ఒకటుంది. అది సరికాదు. (చూ. నా సుందరకాండ వ్యాఖ్య పుట 169) అవివాహితయైన క్షత్రియస్త్రీ కైకసి యందు బ్రాహ్మణుడైన విశ్రవసునికి జన్మించిన రావణుడు తల్లి జాతి ప్రకారం క్షత్రియుడే అవుతాడని మనువు తీర్మానించాడు. వ్యాసునికి శూద్రస్త్రీయందు పుట్టిన విదురుడు, తల్లిజాతి ప్రకారం శూద్రుడే అయ్యాడుగదా! ఆవిధంగా రావణుడు క్షత్రియుడు కాబట్టి పరిపాలనం అతనికి విధ్యుక్త ధర్మమే. అతణ్ణి వధించడంలో దేవ - పతివ్రత - ఋషి విరోధం అనేది ఏదికారణమో ఆ కారణాలలో దైవ విరోధం ప్రధానంగా కారణం. ఈ వధ అధర్మబద్ధమైతే మహావిష్ణువు ఎలా అంగీకరిస్తాడు? కాబట్టి ధర్మబద్ధమే.

వృత్రుని వధించదలచిన విష్ణువు తన తేజస్సుని ఇంద్రునిలోనికీ, వజ్రాయుధంలోనికీ, భూమిలోనికీ ప్రసరింపచేసాడు. ఆ విష్ణుశక్తితో ఇంద్రుడు వృత్రుణ్ణి వధించాడు. బ్రాహ్మణుణ్ణి వధించిన కారణంగా ఇంద్రునికి బ్రహ్మహత్యాదోషం వెంటపడింది. దాన్ని తొలగించుకొనేందుకై అశ్వమేధ యాగాన్ని చేసాడు ఇంద్రుడు. దేవతలంతా ఒక తీర్మానాన్నిచేసి బ్రహ్మహత్య 4 భాగాలు కావాలని నిర్ణయించేసి ఒక భాగం ఆషాఢ శ్రావణమాసాలలో క్రొత్తగావచ్చే మహానదీ జలాలలో, రెండవ భాగం భూమి (చవుడు నేల) లోనూ, మూడవభాగం ఋతుక్రమం కలిగే ఆ మూడురోజులూ స్త్రీలయందూ, నాల్గవ భాగం అపనిందలను బ్రాహ్మణులపై వేసి వారిని అపకీర్తిపాలుచేసే వారియందూ ఉండవలసినదిగా పల్కారు. గమనించిచూస్తే ఈనాలుగూ వ్యక్తి క్షేమాన్ని కోరి ఏర్పాటు చేసినవే తప్ప వేఱుకాదు.

క్రొత్తగావచ్చే నదీజలాలు అశుభ్రాలై సర్వవ్యాధులకీ ఆలవాలాలు కాబట్టి నిషేధించారు. చవుడునేల సేద్యానికీ, గృహనిర్మాణానికీ, నూతుల త్రవ్వకానికీ, కనీసం మెరక చేయడానికై మట్టి పోతకీ కూడా పనిచేయదు కాబట్టి నిషేధించారు. ఇక స్త్రీల ఋతుకాల విషయం. పశువులు కూడా ఒక కాలనియమం కలిగి సంగమిస్తాయి. కేవలం కామం కోసమే జీవించే వారిలా ఋతుకాలం మూడు నాళ్లూ కూడ సంగమిస్తే వ్యాధులు తప్పక కలిగి తీరుతాయి.

అదేదో ఉత్తమ కాముకుని లక్షణంగా భావించి పిచ్చిపత్రికల సూచనలపై (డబ్బు చేసికోవడం కోసం వ్రాసే వ్రాతలని గమనింపక) నమ్మి సంగమిస్తే, ఆ మాదికాలంలో దంపతులకి వచ్చే వ్యాధులకి బాధ్యుడెవరు? మలవిసర్జనంచేస్తూ అన్నం తింటే ఎంతో, ఈ కాలంలో సంగమించడం కూడా అలాంటిదే. అయితే అందుకే నిషేధించారు. ఇప్పటికీ ఆమూడు రోజులూ గృహిణిని ఇంట్లోని ఏవస్తువునీ తాకనీయక పోవడం మా యిళ్లలో సాగుతూనే ఉండడానికి కారణం సంప్రదాయ పరిపాలనమూ, అశుచి అనే ఆలోచనమూ - గృహిణికి పని పాటలలో కవీసపు విశ్రాంతిని ఆ నాల్గురోజులైనా ఇయ్యాలని భావించడమూను. ఇక తపశ్శక్తితో ఏ బ్రాహ్మణుని వలన ఆశీస్సులని పొందవలసి ఉందో వానిపై నిందలని వేసి వారిని అపకీర్తిపాలు చేయడం ఆత్మహాని అవుతుంది కాబట్టి, దీన్ని నిషేధించారని గమనించాలి.

ఇంద్రుడంతటి వానికి బ్రహ్మహత్యాదోషాన్ని తొలగించిన అశ్వమేధ యాగాన్ని చేయడం సరైనదని లక్ష్మణుడు పల్కాడు. రామచంద్రుడు విని పరమానందపడి ఒకప్పుడు ఇలుడనే రాజు కుమారస్వామి పుట్టిన వనానికి వెళ్లి స్త్రీగా మారిపోయి, చంద్రుని పుత్రుడైన బుధుని వలన పురూరవుణ్ణి కని, బుధుడు చేసిన అశ్వమేధ కారణంగా తిరిగి తన పురుషరూపాన్ని పొందాడని తానొక వృత్తాంతాన్ని చెప్పాడు.

ఇంతకు పూర్వం చెప్పుకున్న వృత్రాసురుని కథా, ఈ అశ్వమేధ కథా కూడ బాలకాండలో జరిగిన వృత్తాంతానికి ఉత్తరాలే (సమాధానాలే). విశ్వామిత్రుడు రామలక్ష్మణులకి మలద - కరూశదేశాల పుట్టుకని గూర్చి చెప్తూ వృత్రాసుర వధని చెప్పాడు. ఆ కథకి ఈ వృత్రకథని చేర్చుకోవాలి. అంతేకాదు. అయోధ్యాకాండలో కూడ రాముడు సీతాలక్ష్మణసమేతుడై అరణ్యానికి వెళ్తున్నప్పుడు కౌసల్యామాత చాలసేపు రోదించి చివరికి దీవించింది. వానిలో ఒక దీవన ఇది.

యన్మంగలం సహస్రాక్షే ఘ్నుతో వజ్రధరస్య యత్।

"వృత్రనాశే సమభవత్ తత్తే భవతు మంగలమ్॥" అనేది. దేవతల తల్లి అయిన అదితి, వృత్రుణ్ణి చంపడానికి వెడుతూన్న ఇంద్రునికి ఏవిధమైన మంగళపూర్వకమైన ఆశీస్సు నిచ్చిందో ఆ ఆశీస్సు నీకు మంగళాన్ని కల్గించుగాక! అని దీని అర్థం. ఇక్కడ కూడా వృత్రాసురవధని గూర్చిన విశేషం కావాలంటే ఉత్తరాన్నిచ్చేది ఇదే కాబట్టి, ప్రస్తుతకాండ 'ఉత్తరకాండ'.

ఇక అశ్వమేధయాగం చేయవలసిందిగా దశరథునికి సుమంత్రుడు రహస్యంగా చెప్పడం, సనత్కుమారుల వారి వార్తలసమాచారం, అశ్వమేధయాగ విశేషాలూ - ఏలాచేయాలి? వంటివి బాలకాండలో కన్పిస్తాయి (చూ. బాలకాండ వ్యాఖ్య). అక్కడ అశ్వమేధ యాగం వలన ఫలితాలని గూడ తెలిసికోవాలంటే ఈ ఉత్తరకాండలోని కథని తెలిసికోవాలన్నమాట. ఈ బాలకాండలో ఏ సందర్భం వచ్చిందో, ఆ సందర్భంలోనే ఈ ఉత్తరకాండలో కన్పించే ఆ సంఘటనకు సంబంధించిన వివరాన్ని కూడ వ్రాసి ఉండవచ్చు గదా! అని మనకి అనుమానం ఇప్పుడు ఏర్పడవచ్చు. కాని వాల్మీకి మహర్షికి ఈ ఆలోచన వచ్చి ఉండదా? ఈ ఆలోచన రాకనే ఆయన వ్రాసి ఉండలేదా?

అలా వ్రాయకపోవడానికి కారణం ఒకటే. అయోధ్యలో రాముడు వెళ్లే సందర్భంలో ఆమె దీవించినప్పుడు ఆ వృత్రాసురుని కథని వాల్మీకి చెప్తూ కూర్చుంటే కథాగతికి భంగం కలుగుతుంది. ఔచిత్యం దెబ్బతింటుంది. పైగా ఈ వృత్రాసురకథ మనకి తెలియదని వాల్మీకి చెప్పవలసి వస్తోందిగాని, అక్కడి వారందఱూ ఈ కథని తెలియక ఉన్నారా? లక్ష్మణుడు రామునికీ, భరతుడు రామచంద్రునికీ ఈ కథలని ఉత్తరకాండలో చెప్తూ ఉండడం వారిలో వారికి తెలియని కథలని ఒకరికొకరు చెప్పుకుంటూ కాలక్షేపం చేయడానికా? సీతమ్మ ఎలాగూ అరణ్యాలలో ఉంది కాబట్టి ఈ తీరికలో ఇలా కాలక్షేపం చేస్తే బాగుంటుందని, వారు చెప్పుకొంటున్న కథలు కానేకావు. శ్రీమద్రామాయణంలో. ఏ అనుమానమూ ఎవరికీ తలెత్తరాదనీ - లోకలోకాలా ప్రచారమై ప్రజలంతా తరించాలనిన్నీ వారి భావం. అందుకే పురాణేతిహాసాలని చదివేటప్పుడు 'స్పష్టమగ్రే భవిష్యతి' -

(అనుమానం వస్తే అది మీది గ్రంథంలోకి వెళ్లి చదివితే తొలగిపోతుందనేది ఇందుకే)అని అంటారు.

## అశ్వమేధ యాగం - కుశీలవ గానం

వేదోక్తంగా నైమిశారణ్యంలో అశ్వమేధ యాగం ప్రారంభమైంది. (యాగవిధానానికి చూ.నా బాలకాండ వ్యాఖ్య పుట 30). అందరి ముఖాలలోనూ ఆనందం తరంగిత మౌతోంది. ఒక్కమాటలో చెప్పాలంటే- "న శక్రస్య ధనేశస్య యమస్య వరుణస్య వా - ఈదృశో దృష్టపూర్వో న ఏవ మూచు స్తపోధనాః- ఈదృశో రాజసింహస్య యజ్ఞః సర్వగుణాన్వితః "- ఇంద్రుడు - కుబేరుడు - యముడు - వరుణుడు చేసిన యాగాలని చూచాం గాని ఈ యాగంతో ఏవీ సాటిరావని మహర్షులంతా ఏకకంఠంగా పలికారు. ఆ యాగానికి వచ్చిన మహర్షులంతా ఉండే ప్రదేశానికి సమీపంలో పర్ణశాలలో వాల్మీకి మహర్షి ఉన్నాడు.

ఆయన తన కుశీలవులని పిలిచి 'నాయనలారా! మన శ్రీమద్రామాయణాన్ని బ్రాహ్మణులుండే చోటుల్లో, మునులకి వినిపించేలా, రాజ ప్రాసాదాలవద్దా, యజ్ఞవాటికల్లో, నాలుగు మార్గాల కూడళ్లలో శ్రావ్యంగా విన్పించండి. చిన్న పసివాళ్లయిన మీ కంఠాలు ఒఱుసుకు పోకుండా తియ్యని చెట్ల పండ్లని తిని మరీ పాడండి. ధనం మీద ఆశ ఏమాత్రమూ లేక రోజుకి ఇరవైసర్గల వంతున పాడండి. మీ తండ్రి ఎవరని రామచంద్రుడు అడిగితే వాల్మీకి శిష్యులమని జంకులేక చెప్పండి. రేపటినుండే పాడండి!' అంటూ ఆశీర్వదించి పంపాడు. (కృత్స్నం రామాయణం కావ్యం గాయేథాం పరయా ముదా। ఇమాని చ ఫలా న్యత్ర స్వాదూని వివిధాని చ॥ జాతాని పర్వతాగ్రేషు చాస్వాద్యాస్వాద్య గాయతామ్। దివసే వింశతి స్సర్గా గేయా మధురయా గిరా॥ లోభ శ్చాపి న కర్తవ్యః స్వల్పోఽపి ధనకాంక్షయా। యది పృచ్ఛేత, కాకుత్స్థో యువాం కస్యేతి దారకా। అవాం వాల్మీకి శిష్యౌ స్వో బ్రూత మేవం నరాధిపమ్॥)

కుశీలవులు పరమానందంతో యజ్ఞవాటికకి వెళ్లారు. ఒకే విధమైన ముఖాలు. తలపై నారతో కట్టిన జడలు. విశాలమైన

నుదుటులు. శ్రీకారాల వంటి చెవులు. పాండిత్యం వెదజల్లుతూన్న ఆ ముఖాలలోని తేజస్సు నేరుగా రామచంద్రుణ్ణి సానందంగా స్పృశిస్తోంది. కంఠాలలో అక్షమాలలు. చేతిలో చిడతలు. మెడలలో వీణెలు. ఒకచేయి మీటుతూ ఉంటే, వేఱొకచేయి చిడతతో సంగీతానికి అనువుగా ధ్వనిస్తూంటే మొదటసారిగా రామకథ, పరమ పవిత్రమైన నైమిశంలో, రామభక్తుల సమక్షంలో, రామపుత్రులైన కుశీలవుల కంఠాల నుండి ఒక్కమాఱుగా వెలివడి శరీరాలని గగుర్పొడిచేలా శ్రావ్యధ్వనితో విన్పించాయి. రాముడు శరీరాన్ని మఱచి విన్నాడు.

ఆ ఆనందాన్ని తానొక్కడే పొందరాదని నిశ్చయించుకున్నాడు. పురాణపండితులనీ, వ్యాకరణ శాస్త్రజ్ఞులనీ, కావ్యచ్ఛందో విశేషాలని బాగా ఎఱిగినవారినీ, అష్టాదశ భాషాపండితులనీ, వేదాంత మర్మజ్ఞులనీ.... ఇలా అందఱినీ పిలిచి వారి సమక్షంలో విన్పించాడు. (న చ తృప్తింయ యు స్సర్వే శ్రోతారో గాన సంపదా। జటిలౌ యది న స్యాతాం న వల్కలధరౌ యది విశేషం నాధిగచ్ఛామో గాయతో రాఘవస్య చ ) 'జటావల్కలాలు విడిచినట్లయితే ఇక్కడి ఒకే ఒక్క రాముడు, అక్కడ కుశలవులలో ఇద్దఱుగా ఉన్నట్లు అనుకోవచ్చు' అని సభాసదులంతా అనుకున్నారు. 'అద్దంలో ఉన్నట్లు ఈ ముగ్గురూ (రామ కుశలవులు) ఒకరిని పోలి మఱొకరున్నారు. (ఉభౌ రామస్య సదృశౌ బింబా ద్బింబ మివోత్థితౌ।। ) అని కూడ పైకి అన్నారు సభ్యులు.

మొదటి రోజున మొదటి 20 సర్గల శ్రీమద్రామాయణాన్ని విని 18000 బంగారు నాణెములచొప్పున ఈయవలసిందని తమ్ముళ్లకి ఆజ్ఞనీయగానే (వన్యేన ఫలమూలేన నిరతౌ వనవాసినౌ - సువర్ణేన హిరణ్యేన కిం కరిష్యావహే వనే?) అడవిలో ఉండే మేం ఈ ధనంతో ఏం చేస్తాం? వద్దు - అని వారన్నారు.

శ్రీమద్రామాయణ కావ్యాన్ని గూర్చిన వివరాలని రాముడడిగితే వారు చెప్పారు. 'దీని కర్త వాల్మీకి. ఇది 24వేల శ్లోకాల గ్రంథం. ఇందులో ఇలోపాఖ్యానం (ఇలుని కథ) వఱకూ నూఱు ఉపాఖ్యానాలు. 500 సర్గాలు. ఆఱుకాండలూ ఆ మీద ఒక కాండా కలిపి 7 కాండల గంథాన్ని మా గురువైన భార్గవులు (వాల్మీకి ఈ పేరులోని విశేషంకోసం నా బాలకాండ వ్యాఖ్య పుట 3 ) వ్రాసారు. దీనిలో నీ నడవడి

గూర్చిన విశేషాలు స్పష్టంగా వ్రాయబడ్డాయి (ప్రతిష్ఠా జీవితం యావ త్తావత్ సర్వస్య వర్తతే )' అని.

ఇక అప్పటినుండి అవకాశం చిక్కిన ప్రతిసందర్భంలోనూ ఆ చిన్నారులగానాన్ని వింటూనే సీతాపుత్రులే ఈ కుశలవులని గ్రహించి రాముడు వెంటనే వాల్మీకికి కబురు పంపాడు. 'మహర్షీ! తాను పవిత్ర చరిత్రనే అని సభామధ్యంలో సీత ప్రకటించేటట్లయితే, రేపు సభకి రమ్మనగోరుతున్నాను' అని. (తస్మిన్ గీతే తు విజ్ఞాయ సీతాపుత్రౌ కుశీలవౌ యది శుద్ధ సమాచారా యది వా వీతకల్మషా - కరో త్విహాత్మనః శుద్ధి మనుమాన్య మహామునిం। శ్వః ప్రభాతే తు శపథం మైథిలీ జనకాత్మజా కరోతు పరిషన్మధ్యే శోధనార్థం మమైవ చ॥) సీత అంగీకారాన్ని తెల్పిందని దూతలు చెప్పగానే ఈ వార్తని సభామధ్యంలో ప్రకటిస్తూ రేపటి రోజున సీత సభకు రాగలదని తెల్పాడు రామచంద్రుడు.

### సీతా ప్రతిజ్ఞ నాటి సభ ఎలా ఉంది?

సభలో ఎదురుగా పెద్ద వేదిక. దానికి అభిముఖంగా (ఎదురుగా) కొద్ది క్రిందుగా ఉన్న మొదటి వరుసలో వశిష్ఠ - వామదేవ- జాబాలి- కాశ్యప - విశ్వామిత్ర- దుర్వాస- గర్గ- చ్యవన - పర్వత- నారద- భార్గవ- శక్తి- వామన భరద్వాజ- గౌతమ- మార్కండేయ- పులస్త్య - కాత్యాయన - అగస్త్య - సుప్రభ- సుయజ్ఞ - మౌద్గల్య మహర్షులు ఒకరిప్రక్క ఒకరు కూర్చున్నారు. వీరి వెనుక వరుసలో మునులు, ఆ వెనుక వరుసలో రాక్షసులు, ఆ వెనుక అనేక దేశాల నుండి వచ్చిన రాజులూ, ఆ వెనుక వైశ్యులూ, ఆ వెనుక శూద్రులూ, ఆ వెనుక ఎందఱెందఱో వ్రతనిష్ఠగల బ్రాహ్మణులూ, జ్ఞాన సంపన్నులూ కూర్చుని ఉన్నారు. సీతమ్మని చూడాలనే తహతహతో ఇందఱున్నా ఏ ధ్వనీ లేక మౌనంగా ఉంది సభ. అశ్వమేధం జరిగినా బంగారు సీతా ప్రతిమనే భార్యగా పెట్టుకొని యాగాన్ని చేసిన రాముణ్ణి తలచుకొని మఱింత గంభీరమై పోయింది సభ.

వేదిక మీదికి ఒక ప్రక్కనుండి జ్ఞాన సంపన్నుడు వాల్మీకి మహర్షి వస్తూంటే, కన్నీళ్లని కంఠంలోనే నిలుపుకుంటూ, దుఃఖాన్ని కళ్లలోనే నిల్పుకుంటూ, మనసులో రాముణ్ణే ధ్యానిస్తూ రెండు

చేతులతో నమస్కరిస్తూ పద్మపుమొగ్గలా ఆమె నమస్కారం కన్పడుతూండగా, తలవంచి మెలమెల్లని అడుగులు వేస్తూ బ్రహ్మవెంట మెల్లగా నడిచివచ్చే వేదంలా ఆమె రాసాగింది. సభలో ఉన్న అందఱిలోనూ ఒక్కసారి శోకం పెల్లుబికి అప్పటివఱకూ ఉన్న నిశ్శబ్దం పటాపంచలై 'హో' అనే దుఃఖధ్వని ఎవరిమటుకు వారికి తెలియకుండా బయటికి వచ్చింది. (త మృషిం పృష్ఠతః సీతా త్వన్వగచ్ఛ దవాఙ్ముఖీ। కృతాంజలి ర్బాష్పగతా కృత్వా రామం మనోగతమ్।। దృష్ట్వా శ్రుతి మివాయాంతీం బ్రహ్మాణ మను గామినీం। వాల్మీకేః పృష్ఠతః సీతాం సాధువాదో మహానభూత్।।) కొందఱు రామ రామా! అనీ, మఱికొందఱు హాసీతా! అనీ, ఇంకా మఱికొందఱు హాసీతారాములారా! అని, మొత్తానికి వారికి వచ్చిన అసామాన్య కష్టాన్ని తలచుకొని మళ్లీ కన్నీళ్లు పెట్టారు.

సభ్యులని వాల్మీకి చూచాడు. గంభీరముఖంలోని దుఃఖంతో (ఈ పరిస్థితి ఈ తల్లికి వచ్చిందే! అని) 'రామా! ప్రమాణం చేయడానిక్కూడా నీ అనుజ్ఞ కోరుతోంది ఈమె. ఈయవలసిందిగా కోరుతున్నాను. ఇక రెండవది. ఈ ఇద్దఱు కవలలూ ఈమెకూ నీకూ కల్గిన పుత్రులు కుశీలవ నామధేయులు. వీరు అసాధ్యులు. అసత్యాన్ని ఆడాలనే కోరికకూడా లేని నేను ప్రచేతుని పదవ పుత్రుణ్ణి వాల్మీకిని. అనేక సంవత్సరాలు చేసిన నా తపస్సు మొత్తం, ఈమెలో మనసా, వాచా, కర్మణా ఏ పాపం ఉన్నా బూడిద అయిపోతుందని ప్రతిజ్ఞ చేసి (ఒట్టు పెట్టి) చెప్తున్నాను. సీత అగ్నిప్రవేశం చేసిననాటి విషయం భూజనులకి కొందఱికి తెలియక ఈ అపవాదుని వేసారని దివ్యదృష్టితో గ్రహించి, ఆమెలో దోషం లేదని స్పష్టంగా నమ్మి, నా ఆశ్రమంలో ఇంతకాలం ఉంచాను. ఇటువంటి మహా పతివ్రత తనకి ఇలాటి నిష్కారణ నింద వచ్చిందని మనసు బాధతో తపించిపోతోంది. ఆమె నిర్దోషురాలని నీకు తెలిసి తెలిసి కూడా అడవిలో విడిచావు. నేను చెప్పవచ్చిన దింతే.' అని మౌనంగా ఉండిపోయాడు సుడులు తిరుగుతూన్న దుఃఖంతో వాల్మీకి మహర్షి.

వేదిక మీద మఱొక ప్రక్క ఆసనంలో ఉన్న రాముడు లేచి నమస్కరించి "మహర్షీ! సీతలో దోషంలేదని నాకు అతిస్పష్టంగా తెలుసు. అయినా లోకనిందని ఎలా తట్టుకోగలను? అక్కడ జరిగిన

అగ్నిప్రవేశ విషయం వీరికి ఏమని చెప్పను? ఎలా తెలిసికోగలరు? నమ్ముతారు? లోకాపవాదం కోసమే ఈమెని విడిచాను. ఈ ఇద్దఱూ మా పుత్రులని నాకు తెలుసు. ఈ భూజనులంతా ఈమె నిర్దోషురాలని చెప్తేచాలు. ఈ కళంకాన్ని తొలగించుకుంటాను" అన్నాడు.

ఈ సంఘటన జరుగుతూండగా మెలమెల్లగా అష్టవసువులూ, నవగ్రహాలూ, ఏకాదశరుద్రులూ, ద్వాదశాదిత్యులూ, అప్సరసలూ, గంధర్వులూ, మరుత్తులూ, సిద్ధులూ, సాధ్యులూ, విశ్వే దేవతలూ, అశ్వినీ దేవతలూ అలా సభలోనికి ప్రవేశించి ఆకాశంలోనే నిలిచి వినసాగారు.

కావిచీర కట్టుకొన్న సీత రెండడుగులని ముందుకువేసి తలవాల్చి నేలనే చూస్తూ నిట్టూర్పు విడుస్తూ, నా రామచంద్రుణ్ణే ధ్యానిస్తూ వేఱెవరినీ అనురాగంతో మనసులో నేను తలపని దానినే అయితే, ఓ తల్లి అయిన భూదేవీ! నన్ను నీలో చేర్చుకో!

మనసా- వాచా- కర్మణా నా రామచంద్రుణ్ణి తప్ప నేనెవరినీ పూజించని దానినే అయితే, ఓ తల్లి అయిన భూదేవీ! నన్ను నీలో చేర్చుకో! !

నా రామచంద్రుణ్ణి తప్ప ఇతరుణ్ణి కామంతో ఏనాడూ నేను ఆలోచించని దానినే అయితే, ఓ తల్లి అయిన భూదేవీ! నన్ను నీలో చేర్చుకోమ్మా!!! అంటూ ప్రార్థించింది.

అందఱూ చూస్తూండగానే ఒక సింహాసనం నేలనుండి పైకిరావడం కన్పించింది.

అనేక దివ్యరత్నాలు దానికి పొదగబడి ఉన్నాయి. ఎందఱో సర్పరాజులు దాన్ని మోస్తూ ఉన్నారు.

ఆ సింహాసనంలో తేజస్సుతో వెలిగిపోతున్న భూదేవి, సీతమ్మని హృదయానికి హత్తుకుని సింహాసనంలో కూర్చోబెట్టుకుని మఱుక్షణంలో లోనికి (పాతాళానికి) తీసికొని పోయింది.

ఆకాశంలో నిలబడిన వారంతా పూలవాన కురిపించారు. మహర్షులు ప్రశంసించారు.

భూజనులు వెలతెలపోయారు. ఎందఱో ఆశ్చర్యం నుండి తేఱుకోలేక పోయారు. జరిగినదేమిటో బోధ పడలేదు ఎందఱికో. కాని అందఱిలో దుఃఖమూ పెల్లుబికి 'హో' అనే ధ్వని విన్పించింది. తన సీత భూజనుల కారణంగా తనకి దూరమైపోయిందని రాముడు భూమిపై కోపించి ఏదో చేయబోతే, బ్రహ్మ, రాముణ్ణి శాంతపఱచి రాముణ్ణి విష్ణుదేవుడే అని చెప్పి రాబోయే ఉపద్రవాన్ని ఆపి 'రామా! జరిగిన రామాయణం చూచావుగా! జరుగబోయేది రేపు విను' అని కుశీలవుల రామాయణగానాన్ని వినవలసిందిగా తెల్పి వెళ్లిపోయాడు. (యథాహం రాఘవా దన్యం మనసా పి న చింతయే- మనసా కర్మణా వాచా యథా రామం సమర్చయే- యథైతత్ సత్యముక్తం మే వేద్మి రామాత్ పరం న చ- తథా మే మాధవీ దేవీ వివరం దాతు మర్హతి।।)

**లో విశేషం**

'సర్వం పాప్మానం తరతి - తరతి చ బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే' లోకంలో చేసిన పాపాలూ - బ్రహ్మహత్యా కూడా తొలగుతుంది అశ్వమేధాన్ని చేస్తే. ఎవరో మహాపండితుల ప్రసంగంలో విన్నదాని ప్రకారం రాముడు దశరథ సంబంధం లేకుండా జన్మించడం, శ్రాద్ధాదులని సకాలంలో చేయక పోవడం, తండ్రి మరణిస్తాడనీ - ఆసన్న మరణ దశలో ఉన్నాడనీ - తెలిసికూడా తండ్రిని విడనాడడం సీతమనసు నొప్పించడం..... వంటి లౌకికమైన దోషాలన్నీ ఈ అశ్వమేధం వలన తొలగుతాయని చెప్పారు. పంటని పండించి ప్రజల ప్రాణాలని నిల్పడంకోసం దున్నుతూన్నప్పుడు ఎన్నో ప్రాణులు నిష్కారణంగా వధింపబడతాయి. మనకి వాటి మీద ద్వేషబుద్ధీ- హింసాదృష్టీ లేకున్నా వధించిన పాపానికి వైశ్వదేవం..... వంటివి చేయడం ఎలాగో, ఇదీ ఇలాటిదే. ఎందఱినో బాధించే రావణ - ఇంద్రజిత్ - కుంభకర్ణ - లవణాసురులని చంపడం వంటి మహాపుణ్య కార్యాన్ని చేసిన రామునికీ తమ్ములకీ ఈ చిన్నచిన్నవి పాపఫలాన్ని కూడా ఈయవని మఱికొందఱన్నారు. రామచంద్రుని విషయంలో ఇవి దోషాలు కానే కావనీ పాపకార్యాలు కావనీ అంగీకరిస్తే చిక్కేలేదు. ఔననుకునే పక్షంలో అశ్వమేధం వాటిని తొలగిస్తుందనేది సమాధానం.

ఈ అశ్వమేధాన్ని రాముడు నైమిశమనే అరణ్యంలో ప్రారంభించాడు. అదికూడా వాల్మీకి ఆశ్రమానికి దగ్గఱగానే. ఆ ప్రాంతానికి అనేకులు వచ్చిన సందర్భంలో లోకాపవాద విషయాన్ని నిరూపించి 'సీత పతివ్రత' అనే విషయాన్ని రుజువు చేస్తూన్నట్లుగా ఆమెకు వైకుంఠ ప్రయాణాన్ని ఏర్పాటు చేయవచ్చునని భావించాడు. ఇది నైమిశంలో జరగడంలో కూడ ఒక విశేషం ఉంది. నేమి ఎక్కడ శీర్ణం అవుతుందో అది నైమిశంట. 'నేమి' అంటే చక్రం. కాలాన్ని చక్రంతో పోలుస్తారు. కృత - త్రేత - ద్వాపర - కలి అనే విధంగా కాలం ఎక్కడ అంతం అవుతుందో అది నైమిశం. అంటే పునర్జన్మ ఇక లేనిచోటని కూడ భావించవచ్చు. అలాటి అరణ్యంలో కుశీలవులిద్దఱూ ఇక్కడ- అక్కడ అనే భేదంలేక, వీరు - వారు అనే భేదం లేక, శ్రీమద్రామాయణాన్ని పాడి విన్పించారు. కారణం ఈ గాన మాధుర్యానికి అందఱూ రామభక్తులు కావాలనీ - తరించాలనీను.

సుందరకాండని ఆడువారు చదువవచ్చా? ఉత్తరకాండని ఇంట్లో ఉంచనే కూడదుట గదా! వంటి ప్రశ్నలని కొందఱు వేస్తూంటారు. కుశీలవులు నైమిశానికి వచ్చి, వచ్చిన అందఱికీ విన్పించేలా 7 కాండల రామాయణాన్నీ స్త్రీ - బాల - వృద్ధ - సర్వజాతి జనమూ వినేలా పాడితే ఆ కాండ చదవవచ్చా? ఈ కాండ వినవచ్చా? లాటి అనుమానాలు కల్గడమూ తప్పే. తెలిసీ తెలియక 'అది తప్పు - ఇది తప్పు' అని చెప్పడమూ తప్పే. కాబట్టి 'శ్రీమద్రామాయణాన్ని సర్వులూ వినవచ్చు. పారాయణం చేసికోవచ్చును.' అని వాల్మీకి శిష్యులూ సీతారాముల పుత్రులూ అయిన కుశీలవులు చెప్తున్నారనమాట. ఇలా ఉన్నాకూడా సరికాదని ఎవరైనా అంటే అలాంటి వారి మాటను నమ్మేవారు, సీతారాములకంటె ఎక్కువగా, ఇలాటి తెలిసీతెలియని మాటలని చెప్పేవారిని 'పూజిస్తున్న పుణ్య చరిత్రులు' అని అర్థం చేసికోవలసిందే.

రాముని మీద ఏమాత్రమైనా బురద చల్లనిదే నిద్రపోరాదని కంకణం కట్టుకొన్న మహనీయులు కొందఱు - రామునికి చాలమంది భార్యలున్నారని (వారిలో వారు ఊహించుకుని లేదా కలని కని) - చెప్పారు. (నా సుందరకాండ వ్యాఖ్యలో ఈ విషయం సమూలంగా

చర్చించబడి అసత్యం అని చెప్పడం జరిగింది.) అన్ని ప్రశ్నలకీ ఉత్తరాలనిచ్చే ఈ ఉత్తరకాండలో ఈ విషయం మఱింత స్పష్టంగా ఖండింపబడింది. 'న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునందనః। యజ్ఞే యజ్ఞే చ పత్న్యర్థం జానకీ కాంచనీ భవత్' సీతకాక వేఱే భార్యని రామచంద్రుడు స్వీకరించనే లేదు. ప్రతి యజ్ఞంలోనూ (తాను చేసిన వాజపేయం నుండి అశ్వమేధం వఱకు) బంగారు సీతాప్రతిమని భార్యగా ఉంచి యజ్ఞాన్ని నిర్వహించాడని ఈ శ్లోకం చెప్తోంది స్పష్టంగా.

శ్రీమద్రామాయణ గానాన్ని విని పరవశించిన రాముడు 18000 బంగారు నాణాలతోపాటు వారు కోరినదిమ్మని తమ్ములకు ఆజ్ఞ చేసాడు. క్షత్రియుడు దానాన్ని స్వీకరింపడు. ఈ పుత్రులిద్దఱూ ఎవరనే (ఎవరి పుత్రులు) విషయం అందఱకీ దీనితో తెలిసిపోతుంది గదా! అని కూడ రాముని ఆలోచన. వాళ్లు రామాలోచనకి అనుగుణంగానే అరణ్యాల్లో ఉండే మాకు ధనంతో ఏం పని? అననే అన్నారు. 'క్షత్రియులం మాకు వద్దు' అని అనలేదు. తీసికోవద్దని వాల్మీకుల వారి ఆజ్ఞ. తీసికొనిపోక పోవడంలోని రహస్యం ఇదే.

ఈ లవకుశులకే మహర్షులు 'కశ్చిత్ ప్రాదాద్యజ్ఞ సూత్రమ్....' యజ్ఞోపవీతాన్నీ, దండాన్ని, గోచినీ....... ఇలా ఇస్తే స్వీకరింపలేదా! ఇక్కడ శ్రీమద్రామాయణాన్ని వినిపిస్తూన్నది తమ తండ్రికి, పిల్లలు. తండ్రి లేదా గురువుని తమ విద్య లేదా ప్రతిభ ద్వారా పిల్లలు లేదా శిష్యులు ఆనందపఱిస్తే తండ్రి లేదా గురువు తన ఆశీర్వచనాన్ని పుత్రునికి లేదా శిష్యునికియ్యాలి గాని ధనాన్ని (నేటి కాలపు కొందఱు తండ్రులులాగా) ఇయ్యనే కూడదు. ధనాన్ని స్వీకరించడం భృత్య లక్షణం. (కొంత భృతిని (జీతాన్ని) తీసికొని సేవ చేసేవాడు భృత్యుడు). ఆశీర్వదించి అభివృద్ధిని కోరడం పితృలక్షణం లేదా గురులక్షణం అని గమనించాలి. వాల్మీకి వీరిద్దఱినీ స్వీకరించవద్దని తెల్పడాని క్కారణం తండ్రి నుండి దూరంగా ఉన్న ఈ పిల్లలు తండ్రి ఆశీస్సులని అనునిత్యం పొందేలా రాముని దగ్గఱకు చేరాలని.

తాను విన్న శ్రీమద్రామాయణ కావ్యాన్ని మఱోమాఱు ఎందఱెందఱికో విశేష పాండిత్యం కలవారికి విన్పించాలని భావించి

తెలియనివారు వ్రాసిన అనువాదాలని పట్టుకొని వేళ్లాడి, ఆ పఠిత-శ్రుత పాండిత్యాలతో 'తమకి తోచినదే నిజం' అని వాదించే పుణ్యాత్ములు కొందఱున్నారు. లోకంలో, శ్రీమద్రామాయణాన్ని చదివితే అన్ని అనుమానాలూ అలా తొలగిపోతాయి. ఇందఱిందఱు మహర్షుల మేధలకి తట్టని విషయం, క్షణం క్రితం చదివిన విషయంకూడా సరిగా గుర్తు ఉండని 'వరం' ఉన్న మనకి తడుతుందా? - మన ఆలోచనలో ఏదో దోషం ఉందని ఒక్కక్షణం భావించ గల్గిననాడు వేడికి వెన్న కఱిగినట్లు శ్రీమద్రామాయణం అలా అర్థమైపోతూ వెడుతుంది. భవతు.

శ్రీమద్రామాయణంలో వాల్మీకికి గ్రంథకర్తగా కాక మఱొక ప్రత్యేక స్థానం కూడా ఉంది. లోకదృష్టిలో విడువబడిన భార్యగా ఉన్న సీతమ్మని ఆశ్రమానికి తెచ్చి ఎంతో సపర్యని చేసి ఆమెకు మనశ్శాంతిని కల్గించిన ఉత్తముడు వాల్మీకి. లోకంలో ఎవరైనా దురదృష్టవశాత్తూ ఇలా భర్తచేత విడువబడితే, ఆ స్త్రీకి సానుభూతిని తెల్పేవారిలా ప్రక్కకివచ్చి ఎందుకు విడిచాడు? ఏం జరిగింది? '...వంటి ఎన్నో ప్రశ్నలని గ్రుచ్చిగ్రుచ్చి అడిగి చివరికి ఈ విశేషాలనన్నింటినీ ప్రపంచానికి వంకరగా తెలియచేయడమే ఈ ప్రశ్నించిన వారంతా ఈమెకి చేయగల సహాయం. ఇటువంటివారు శ్రీమద్రామాయణాన్ని చదివి నేర్చుకోవలసినది విషయాన్ని గుప్తంగా భద్రంగా ఉంచగలగడం. చివరి వఱకూ కూడ, ఆ పుత్రులకి తండ్రి రాముడే అనే విషయాన్ని కూడ రహస్యంగా ఉంచి, ఆ సంసారాన్ని రక్షించాడు వాల్మీకి. వైకుంఠానికి వెళ్లవలసిన కర్తవ్యం మీద సీతమ్మ రసాతలానికి (పాతాళం) వెళ్లిందే తప్ప, లేనిపక్షంలో భర్తని చేరడానికే కదా ఆమె వచ్చింది!

పూర్వకావ్యాలూ - ఇతిహాసాలూ - పురాణాలూ వీలయినంత సంసారాన్ని చక్కదిద్దడానికీ, ఎక్కడైనా విఱిగిన సంసారాలని అతకడానికీ వ్రాయబడ్డాయి. అనేక సంవత్సరాలు చేసిన తపస్సుమీద ఒట్టుపెట్టి సీతా పాతివ్రత్యాన్ని గూర్చి పల్కిన వాల్మీకి కంటె, లోకంలో ఎవరు స్త్రీజాతి సముద్ధరణకి పాటుపడ్డవారున్నారు? (బహూ వర్ష సహస్రాణి తపశ్చర్యా మయాకృతా నోపాశ్నీయాం ఫలం తస్యా దుష్టేయం యది మైథిలీ॥) సంసారి కాని తనకి, సంసారాలని కలిపి లోకక్షేమాన్ని కల్గించడానికై సంసారులపై ఉన్న తపన ఎంతదో అర్థం

చేసికొంటే 'శ్రీమద్రామాయణం నిత్య పఠనీయ గ్రంథం సుమా!' అని అంగీకరించి తీరాలి.

స్త్రీకి కష్టం వచ్చిననాడు, ఇలా ఉదాత్తుడైన ఒకరు సంసారాన్ని సరిచేయగలరు. అయితే ఈ వాక్యాన్ని ఆధారంగా తీసికొని నమ్మరాని వారిని నమ్మితే ప్రమోదం కాక అది ప్రమాదానికి (పొరపాటు) అవకాశాన్నిస్తుంది. సీతారాముల మధ్యన ఉన్న వాల్మీకి మాటలలోనూ రాముని మాటలలోనూ ఉన్న అర్థాన్ని గమనిస్తే, సీత రామునితో ఇక ఉండదనే విషయం సీతారాములిరువురికీ తెలుసనే విషయం స్పష్టంగా అర్థమౌతుంది. 'సీతమ్మ తనకు తాను' నేను 'పవిత్రురాలనే' అని సభామధ్యంలో ప్రకటించ గలదు' అని వాల్మీకి అన్నాడే గాని, 'అలా ప్రకటిస్తే నీవు స్వీకరించాలి సుమా!' అని రామునితో అనలేదు. రాముడు కూడా సీతమ్మ నిర్దోషురాలని భూమిజనుల మధ్య చెప్తే సంతోషపడతాను' అని అన్నాడేగాని 'ఆమెదట ఆమెను స్వీకరిస్తాను' అని ఆయన అనలేదు. వీరిద్దఱూ ఇంతమాత్రమైనా ఒకరితో ఒకరనుకున్నారు గాని సీతమ్మ అటూ - ఇటూ ఎటూ పల్కలేదు. కారణం సీతమ్మ మొదటి నుండీ గాంభీర్యవతి.

అలనాడు అడవిలో సీతారామలక్ష్మణులని విడిచిన పిమ్మట ఎవరెవరు ఎలా ఉన్నారు? ఏమన్నారు? అని దశరథుడు అడిగితే, సుమంత్రుడు సమాధానం చెప్తూ - లక్ష్మణుడైతే - "నిన్ను అసలు తండ్రే కాదన్నాడు. రాముడు కన్నీళ్లతో ఉండి పల్కలేక పల్కలేక తమ్ముళ్లనీ - తల్లులనీ సరిగా చూడమని చెప్పాడన్నాడు. ఇక సీతమ్మ మాత్రం ఒకసారి తననీ ఒకసారి రథాన్నీ ఒకమాఱు రాముణ్ణీ చూస్తూ దుఃఖంతో ఏమీ మాట్లాడనే" లేదని అన్నాడు. (నిరీక్షతే రాజ! రథం తథైవ మామ్) ఇద్దఱి అభిప్రాయమూ తెలిసిందిగాని సీతమ్మ అభిప్రాయం దశరథునికి తెలియలేదు. అంతటి గాంభీర్యం ఆమెది.

కూతురికి కష్టం కల్గినప్పుడు రక్షించేది తల్లి మాత్రమే. అలాగే కష్టం వచ్చినప్పుడు ఎవరు తలుచుకొన్నా 'అమ్మా!' అనే. ఇలా జరగబోతోందని తెలిసినా తెలియకున్నా, పట్టాభిషేకానికి వచ్చిన జనకుడు, లోకాపవాదానికి గుఱిఅయి వాల్మీకి ఆశ్రమానికి సీతమ్మ వెళ్లిందన్నప్పుడైనా వచ్చి చూడవచ్చు గదా! అన్పించవచ్చు.

సంవత్సరాలు అరణ్యానికి పోయినప్పుడూ, సీతాపహరణం జరిగినప్పుడూ కూడా రానివాడు ఇప్పుడు మాత్రం వస్తాడా? రావాలని భావించడం మన తప్పు తప్ప. పోనీ పట్టాభిషేకానికి వచ్చినప్పుడైనా ఆమె కష్టాలు పడిందని ఓదార్చనూ లేదు. అయోనిజ అయిన సీతమ్మకు మర్త్యుడైన (మానవుడు) తాను సహాయం చేయడమేమిటి? అనీ, జగన్నాటకం సక్రమంగా సాగాలి అనీ, భావించి అవతార రహస్యం తెలిసిన తాను లోకదృష్టిలో నింద్యుడే అని తెలిసినా రాలేదు. ఏ సీతకి ఆ భూదేవి తల్లియో, ఆమెయే స్వయంగా సింహాసనంపై వచ్చి ఇక ఈమెని పాతాళానికి తీసికొనిపోయింది. ఆకాలంలో ఆమె భర్తనీ, బంధువులనీ, స్త్రీ ఎవరిని మాత్రమే అహర్నిశలు స్మరిస్తుందో ఆ సంతానాన్నీ కూడా స్మరించకుండా, తలవంచి నమస్కరిస్తూ రాముణ్ణే (మహావిష్ణువునే) ధ్యానిస్తూ వెళ్ళిపోయింది పాతాళానికి. రామునికంటె ముందుగా వేదవతీ రూపంలో వచ్చి అగ్నిలో దగ్ధురాలై భూమిలో నుండి పుట్టి తిరిగి భూమిలోనికే వెళ్ళిపోయింది సీత. సీతమ్మ ఇక వైకుంఠానికి పోబోయే ఘట్టం కదా! అని ఆ కారణంగానే రుద్రులూ, ఆదిత్యులూ, అశ్వినీ దేవతలూ . . . ఇలా ఎందఱెందఱో ఆ సంఘటన జరుగుతూన్నప్పుడు వచ్చారని కథలోని రహస్యంగా గమనించాలన్నమాట.

## శ్రీమద్రామాయణ శేషం

రామునితో బ్రహ్మ ఇలా అన్నాడు. 'రామా! ఆమెకోసం దిగులు పడకు. ఇక్కడి నుండి వెళ్ళిపోయినా తిరిగి ఆమె వైకుంఠంలో నిన్ను చేరుతుంది. ఈమీదట ఏమి జరుగబోతోందో ఆ భవిష్యద్దృష్టిని (Forecast - clairvoyance) వాల్మీకికి నే నను(గహించాను విను' అనగానే రాముడు కుశీలవులని ఆమీది ఘట్టాలని పాడవలసిందిగా కోరాడు. జరగబోయే కథని కూడా వాల్మీకి మహర్షి తప్పక జరిగితీరుతుందనే అభిప్రాయంతో వ్రాసి ఉన్నాడు. అందుకే ఈ కథని భూతకాలంలోనే వ్రాసాడు. అంటే జరిగిపోయిన కథలాగానే వ్రాసాడు. కాబట్టి 'ఫలాని రాజ్యాలని జయించారు' అని ఇక మీదట కథ వినిపిస్తే 'ఫలాని రాజ్యాలని జయించగలరు' అని రాబోయే కథగా ఊహించుకోవాలన్నమాట.

రామచంద్రుడు తన తమ్ములతో అనేక యాగాలని చేసాడు. రాముని తల్లి కౌసల్య ముందుగానూ, ఆ పిమ్మట లక్ష్మణశత్రుఘ్నుల తల్లి సుమిత్ర, ఆ మీదట కైకమ్మా మరణించి స్వర్గంలో దశరథుణ్ణి చేరుకొని ఆనందపడ్డారు. రాముడూ, తమ్ముళ్లూ వారికి చేయవలసిన కృత్యాలనన్నింటినీ యథాశాస్త్రంగా భూలోకంలో చేసారు. (స్వర్గంలో వీరంతా ఈ రూపాలతోనే ఉండడానిక్కారణం మహావిష్ణు బంధువులు గదా!)

భరతుడు తన పుత్రులైన తక్షుడు - పుష్కలుడు అనే ఇద్దఱితోనూ కలిసి రామాజ్ఞపై గాంధార దేశాలని జయించి వారి దేశాలయిన తక్షశిల - పుష్కరావతి అనే రెండు రాజ్యాలనీ తన ఇద్దఱు పిల్లలకీ అభిషేకించాడు. (తక్షశిల - Taxila - గాంధారదేశం Kandhahar)

శత్రుఘ్నుడు తన పుత్రులు సుబాహువు, ఘాతి అనే వారితో ఎలాగూ రాజుగా ఉంటున్నాడు కాబట్టి లక్ష్మణుని పుత్రులు 'అంగదుడు - చంద్రకేతువులకి' రాముడు కారుపథం - చంద్రకాంత దేశాలని కట్టబెట్టాడు.

## లక్ష్మణునికి మరణ శిక్ష!

పేరుకి తానే రాజైనా భరతుడు తన పుత్రులు సుబాహువుకి మధురా నగరా బాధ్యతనీ, 'ఘాతి' కి వైదిశ నగర బాధ్యతనీ ఇచ్చి తాను పైపైన పరిపాలనని గమనిస్తూ ఉండిపోయాడు. కాలం ఇలా గడుస్తూ ఉండగా ఒకరోజున ఒక ముని (యముడు) వచ్చాడు. మహా ప్రకాశవంతుడైన ఆమునిని లక్ష్మణుడు రామునివద్దకు తీసికొనిపోయాడు. రాముడు మునితో మాట్లాడుతూ ఆయన కోరిక ప్రకారమే 'లక్ష్మణా! ద్వారం వద్ద నువ్వే ఉండు. మేం మాట్లాడేటప్పుడు ఎవరు వచ్చినా విన్నా వాడు మరణదండనకి పాత్రుడు సుమా!' అన్నాడు. (యః శృణోతి నిరీక్షే ద్వా స వధ్యో భవితా తవ। ద్వారి తిష్ఠ మహాబాహో! ప్రతీహారం విసర్జయ॥)

మునివేషంలో వచ్చిన యముడు రామునితో ఇలా సంభాషించ సాగాడు. 'దేవా! వచ్చిన నేను యముణ్ణి. బ్రహ్మ నన్ను కొన్ని మాటలని చెప్పమని పంపించాడు. మొదట్లో నీటిని సృష్టించావట. ఆ మీదట ఆపిమ్మట కమలంలో బ్రహ్మని (తనని) సృష్టించావట. ఆ మీదట

అనంతుడనే సర్పాన్ని భూభారాన్ని మోయడానికి సృష్టించావట..... ఇలా జరిగిన సృష్టి మొత్తం నీ సంకల్పానికి అనుగుణంగానే సాగిందట. రావణవధ కోసం భూలోకానికి వెళ్లివస్తానని చెప్పి 11 వేల సంవత్సరాలు కాలనియమం ఏర్పాటు చేసికొన్నావట. అయితే ఈ ప్రాణి సమూహాన్ని సృష్టించగల బ్రహ్మ, తనకి రక్షించే సామర్థ్యం లేదని తెల్పవలసిందిగా చెప్తూ నీవు వచ్చే కాలాన్ని తెలిసికొని రావలసినదిగా నన్ను పంపాడు' అన్నాడు.

రాముడు నవ్వుతూ 'యమా! చేయవలసిన అన్ని పనులూ చక్కబడ్డాయి. ఎక్కడి నుండి వచ్చానో అక్కడికి వచ్చే సమయమూ అయింది. నేనిదే విషయాన్ని అనుకుంటూంటే నువ్వే వచ్చినందుకూ, ఏకాంతంగా నాతోనే చెప్తున్నందుకూ కూడ ఆనందంగా ఉంది' అన్నాడు. (భద్రం తేఽస్తు గమిష్యామి యత ఏ వాహమాగతః। హృద్గతో హ్యసి సంప్రాప్తో న మే తత్ర విచారణా।।)

ఈ మాటలిలా సాగుతూండగా, లక్ష్మణునికి దూర్వాసుని బాధ ఎక్కువైంది. రెండు నిముషాలకోమాటు లోపలికి పంపవలసిందిగా బాధ పెట్టసాగాడు. చివరికి 'లక్ష్మణా! నీ కారణంగా నీ వంశాన్నీ అన్నలనీ తమ్ములనీ మాడ్చివేస్తాను' అంటూ కోపిష్ఠి దుర్వాసుడు హెచ్చరించగానే భయపడిన లక్ష్మణుడు, ఇందఱు పోవడం కంటె తనకొక్కనికి మరణశిక్షపడి లోకం విడిచినా మేలే' అని నిశ్చయించి లోపలికి రానేవచ్చి దుర్వాసుని మాటలని చెప్పాడు లక్ష్మణుడు. (విషయం త్వా పురం చైవ శపిష్యే రాఘవం తథా। భరతం చైవ సౌమిత్రే యుష్మాకం యా చ సంతతిః అస్మిన్ క్షణే మాం సౌమిత్రే న నివేదయసే యది।। ఏకస్య మరణం మేఽస్తు మా భూత్సర్వ వినాశనమ్।)

నియమం ప్రకారం లక్ష్మణునికి మరణశిక్ష విధించవలసి వచ్చిందని రాముడు బాధపడ్డాడు. లక్ష్మణుడు మాత్రం నిశ్చింతతో 'రామా! ఇంతవఱకూ, ధర్మాన్ని ఆచరించిన నువ్వు నాకోసం అధర్మపరుడివి కావద్దు. కర్తవ్యాన్ని నిర్వహించు' అన్నాడు. వశిష్ఠుడు దీనిని గమనించి 'రామచంద్రా! ఇది ఇలా జరుగుతుందని నేడు తెలిసింది కానేకాదు. దుర్వాసుడు అలనాడు చాతుర్మాసదీక్షలో ఏనాడో దశరథునికి చెప్పనే చెప్పాడు. నీ బహిః ప్రాణమైన లక్ష్మణుణ్ణి విడువు.

సత్పురుషులు ఎవరైనా విడిచివేయడం అంటే 'అది మరణశిక్షని విధించడంతో సమానమే' అన్నాడు. రాముడలాగే ఆజ్ఞ చేసాడు. (విసర్జయే త్వాం సౌమిత్రే! మా భూ ద్ధర్మవిపర్యయః। త్యాగో వధో వా విహితః సాధూనాం తూభయం సమమ్॥)

లక్ష్మణునికి రామచంద్ర వియోగం పిడుగుపాటులా అన్పించింది. చెప్పలేని భారం తలపై మోపినట్లయింది. కాళ్లక్రింది నేల క్రిందికి ఎక్కడికో వెళ్లిపోతున్నట్లనిపించింది. అయితే సుమంత్రుడు ముందే చెప్పిన కారణంగా నిలద్రొక్కుకోగలిగి ఇక తన భార్య ఊర్మిళకీ! పుత్రులకీ మరెవరికీ కూడా చెప్పకుండా కన్నీళ్లతో అలాగే సరయూనది ఒడ్డున నిలబడి ఇంద్రియాలని బంధించి గాలిని బిగబట్టి ఇక చైతన్యాన్ని కోల్పోయాడు. ఇంద్రుడు స్వర్గానికి కొనిపోయాడు. పుష్పవర్షం కురిసింది. (విష్ణువు రాకకి ముందు అతని శయ్య అయిన శేషుడు వెళ్లాలిగా! వెళ్లాడని అర్థం చేసికోవాలి).

అన్నకు సేవ చేయడం (కైంకర్యం) మాత్రమే తన లక్షణంగా కలవాడు లక్ష్మణుడు. అతడు లేకపోయాక తానూ ఉండదలచలేదని రాముడు పలికి భరతుణ్ణి అయోధ్యకు రాజుగా పట్టాభిషేకం చేయవలసిందని ఆజ్ఞాపించాడు.

భరతుడు నిరాశతో 'అన్నా! కుశుణ్ణి దక్షిణ కోసల దేశాలకీ, లవుణ్ణి ఉత్తరకోసల దేశాలకీ అభిషేకించు. నేను నీతో రాదలిచాను. తమ్ముడైన శత్రుఘ్నునికి వార్తని పంపవలసిందిగా ప్రార్థిస్తున్నాను' అంటూ గొంతు పెగలని దుఃఖంతో తలవాల్చి కూచుండిపోయాడు.

అయోధ్యా పౌరులంతా 'హా' అని రోదించారు. మేమూ తోడుగా వస్తామని పలికారు. క్షణాలలో పట్టాభిషేకపు ఏర్పాట్లు కాగా కుశలవులకి దక్షిణ - ఉత్తరకోసల దేశాలని ఒప్పగించాడు రాముడు. చివరిసారిగా వారి తలలని ముద్దాడాడు. అయోధ్య ఇక జనులతో ఉండని రోజులు తొందరలో రాబోతున్నాయన్నమాట. అక్కడి ప్రజలూ తనతో రాదలిచామనగానే అంగీకరించాడు రాముడు.

అక్కడ మధురలో శత్రుఘ్నునికి కబురు చేరింది. ఇంత వణికూ తన పుత్రులు చూస్తూన్న మధుర, విదిశ పురాలనే సుబాహు - ఘాతి అనే తన పుత్రద్వయానికి అభిషేకించి వేగంగా అంతఃపురం చేరాడు శత్రుఘ్నుడు.

## చివరి ఘడియలు

సన్నని పట్టుబట్ట ధరించి రాముడు వెలుగుతూన్న అగ్నిహోత్రంలా ఉన్నాడు. ఆయన ఎదుట ఒకరి వెనుక ఒకరుగా ఒక వరుస చొప్పున ఎన్నోవరుసలుగా వానరాలూ, ఎలుగుబంట్లు, రాక్షసులూ, దేవపుత్రులూ, మునిబాలకులూ, అయోధ్యా ప్రజలూ నిలబడ్డారు.

ముందువరుసలో వానరాలకి ప్రతినిధిగా సుగ్రీవుడూ, రాక్షస ప్రతినిధిగా విభీషణుడూ, అన్ని వరుసలకీ ఎదురుగా రామునికి చేరువలో ఆంజనేయుడూ ప్రముఖంగా కన్పించారు శత్రుఘ్నునికి. దిగాలుగా ఉన్న భరతుడు తల ఎత్తనే లేదు.

దుఃఖంతో బొంగురుపోయిన కంఠంతో సుగ్రీవుడు చేసిన ప్రార్థనని విన్నాడు రాముడు. 'సుగ్రీవా! స్వర్గానికీ, వైకుంఠానికీ దేనికి పోయినా నిన్ను విడిచిపోనే పోనని అభయాన్నిచ్చాడు. (సఖే! శృణుష్వ సుగ్రీవ! న త్వయా హం వినాకృతః। గచ్ఛేయం దేవలోకం వా పరమం వా పదం మహత్।।) సుగ్రీవుడు ఇక్కడే ఉన్నా అతడు స్వర్గానికి వెళ్లినట్లే అక్కడివారికి అన్పించాడు. ఎంతటి అదృష్టవంతుడో కదా! అనుకొన్నారంతా.

ఒక్కడుగు ముందుకు వేసి విభీషణుడు కూడా ఇదే కోరికని యాచించాడు. 'విభీషణా! (యావ చ్చంద్ర శ్చ సూర్య శ్చ యావ త్తిష్ఠతి మేధినీ। యావచ్చ మత్కథా లోకే తావద్రాజ్యం తవా స్త్విహ శాసిత స్త్వం సఖిత్వేన కార్యం తే మమ శాసనమ్।।) సూర్యచంద్రాదులూ - భూమి ఉన్నంతకాలం నాకథా, నీ లంకారాజ్యం లోకంలో వి(క) న్పిస్తుంది. నా స్నేహితునిగా నువ్వు లంకారాజుగా ఉండాల్సిందే. పరిపాలనని నిర్వహించు' అన్నాడు.

అయోధ్యా జనులని దాటి వానరులూ, ఎలుగుబంట్లూ రాముని వద్దకు వచ్చి 'రాజా! నరకంలో యమ యాతనని ఇప్పటివఱకూ ఎఱుగం గాని నువ్వు అయోధ్యని విడిస్తే మాకు ఆ పరిస్థితి తెలుస్తుంది.' అని క్లుప్తంగా మాట్లాడినా మనోబాధని క్షణంలో

వ్యక్తీకరించి చెప్పారు రామునికి. రాముడు తనతో రమ్మన్నట్లు తలనాడించి అంగీకారాన్ని తెలిపాడు.

అందఱూ రామునివెంట పోదలచిఉండగా ఆంజనేయ - జాంబవంతులు మాత్రం అక్కడే నిలిచి రామాజ్ఞ కోసం ఎదురుచూస్తూ ఉండిపోయారు. వారిద్దఱినీ సాదరంగా చూస్తూ 'నా ఆజ్ఞప్రకారం రామకథ ఉన్నంతకాలం భూమిలో ఉండి ఆనందపడండి. కలి ప్రారంభమైన వేళ భూమిని విడిచి రండి' అన్నాడు.

ఇక వీరందఱితో గడుపుతున్న ఆ రాత్రియే రాముడు అయోధ్యలో ఉండే చివరి రాత్రి.

భూమిలో నివసించే ఆఖరి రాత్రి అదే. ఆమఱునాటికి ఇక అయోధ్య రాజధాని కానేకాదు. తలచుకొంటేనే అందఱికీ కన్నీరు మున్నీరయింది.

రాత్రి తెల్లవారింది. చేయవలసిన దైవకృత్యాలన్నీ అయిపోయాయి. వేదమంత్రాలు వినిపిస్తూ అగ్నిహోత్రాన్ని పట్టుకుని బ్రాహ్మణోత్తములు ముందు నడక సాగించారు. వారి వెనుక పురోహితుడైన వశిష్ఠ మహర్షి కదిలాడు. ఆకాశంలో ఎందఱెందఱో సిద్ధ - సాధ్య - కింనరాదులు ఈ దృశ్యాన్ని చూస్తూ నిలబడి ఉన్నారు.

సాముద్రికశాస్త్రానికి అనుగుణంగా ఉన్నవీ, ఎందఱెందఱో భక్తులకు మోక్షాన్ని అనుగ్రహించినవీ అయిన రాముని పాదపద్మాలు మెల్లగా అడుగులు వేయసాగాయి.

చేతి వ్రేళ్లకి దర్భలు కన్పిస్తున్నాయి. నీలమేఘశ్యాముడు నడుస్తూంటే ఒక మేఘం కదిలి వెడుతూన్నట్లనిపించింది. సన్నని తెల్లని వస్త్రం ధరించి, ప్రణవాన్ని (ఓంకారాన్ని) మనసులో ధ్యానిస్తూ, మౌనముద్రతో, ఇంద్రియ సుఖాన్ని లెక్కచేయక కఠినశిలల మార్గమని కూడ భావింపక ఆయన నడుస్తూనే ఉన్నాడు.

రాముడు కదలుతూంటే ఎడమవైపు శ్రీమహాలక్ష్మి, కుడివైపు భూదేవి, ముందు రుద్రశక్తి, వెనుకగా చతుర్వేదాలూ, గాయత్రి, ప్రణవం, వషట్కారం నడువసాగాయి. ఆయన ధనుర్బాణాలు రెండూ, పురుషరూపాలని ధరించి వెంటపోసాగాయి. రాముని వెంట వెడుతూన్న

మహర్షులెందరో తమ తమ తపశ్శక్తికి యోగ్యమైన (అర్హమైన) ఆయాలోకాల తలుపులు తెరచి ఉండడాన్ని చూచి, సరిగా ఆయా లోకాలలోనికే వెళ్తూండడం కన్పించింది.

ఏ ఒక్కరి ముఖంలోనూ అలసట లేదు. ఏఒక్కరి ముఖంలోనూ నిరాశలేదు. 'చావు' అనే ఊహలేదు. రక్షకుని వెంట వెళ్లే సైన్యంలా ఉన్నారు ఆ ప్రజాసమూహమంతా. రాముడు వెడుతూంటే అక్కడక్కడి జనపదాల వారు (పల్లెటూళ్ల ప్రజలు) కూడ తమతమ తపశ్శక్తికి అనుగుణంగా కొంతమంది ఆయనని వెంబడించారు.

ప్రాణి - అప్రాణి ; బాల - స్త్రీ - వృద్ధ ; స్త్రీ - పురుష ; స్థావర - జంగమ ; పశు - పక్షి ; జ్ఞాన - అజ్ఞాన; కృతజ్ఞ- కృతఘ్న ; భేదం లేక అంతా రాముని వెంబడి వెళ్లాయి.

ఒక్కమాఱు తన వెంటనున్న వారిని చూచాడు. (ఇందఱిలో ఆస్తిక్య భావం ఉందన్నమాట) అప్పటికి ఇందఱితో తాను 1½ ఆమడల దూరం పడమటి వైపుకి వచ్చాడు. సరయూనది అక్కడ గాని లేదు గదా!

ప్రశాంతంగా పడమటికి ప్రవహిస్తోంది సరయూనది. ఆ నది లోతుని పైన కన్పిస్తున్న సుడులు బాగా తెలియజేస్తున్నాయి.

నడుస్తూ వస్తున్న రామచంద్రుడు మెలమెల్లగా సరయువులో దిగాడు. చీలమండలు, పాదాలు, పిక్కలు, మోకాళ్లు, తొడలు, బొడ్డు, ఉదరం, వక్షఃస్థలం, కంఠం ఇలా నీటితో కప్పబడిపోతూంటే వెంటవెళ్తూన్న వారుకూడ నిర్భయంగా సరయువులోనికి ప్రవేశిస్తూనే వెళ్లిపోతున్నారు ముందుముందుకి, లోతులోతుకి.

ఇంద్రియాలని నియమించి రామచంద్రుడు అలా ముందు ముందుకి సరయూ నదిలోనికి వెళ్లి ఇక కన్పించలేదు.

నది సుడులు తిరుగుతూనే కన్పిస్తోంది.

సూర్యుడు ప్రకాశిస్తూ తన కిరణాలని ఆ నీటి మీదుగా ప్రసరింపచేస్తూనే ఉన్నాడు.

ఇక అయోధ్య లేదు. అంతఃపురం లేదు.

అక్కడ దశరథ - కౌసల్య -సుమిత్ర - కైకమ్మల జాడలూ లేవు. అయోధ్యా ప్రజల గుర్తులూ లేవు.

ఎంత కథ జరిగిందో! ఎంత మాధుర్యం వర్షించిందో!!

ఎంతటి కల చెదిరిపోయిందో!!!

అయితే ఈ అశేష రామకథ, ఆ వైభవాన్నీ గుండెలలో పదిలపఱచుకున్న రామభక్తుల హృదయ ద్వారాలని తెఱిచేందుకు రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల్లా నల్గురు మనకి కన్పిస్తున్నారు వారే కుశీలవులూ ఆంజనేయ విభీషణులూను.

చూస్తూండగానే బ్రహ్మా ఆహ్వానించాడు ఆకాశం నుండి శ్రీమహావిష్ణువు లోనికి (రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు)నాలుగు వైష్ణవ తేజస్సులు ప్రవేశించాయి. ఎందఱో మహాపురుషుల (వానరులు) వేషాలలో దేవతలలో ప్రవేశించారు.

ఎన్నో దివ్య విమానాలు దివ్య పురుషులతో నిండి (అయోధ్యా ప్రజ మొదలగువారు) వేగంగా బయలుదేరారు.

అందఱికీ స్వర్గంలో ఆయాస్థానాలని నిర్ణయించి చూపి బ్రహ్మ తన సత్యలోకానికి వెళ్లాడు.

ఇక భూలోకంలో ఇక్కడ కుశీలవుల శ్రీమద్రామాయణ గానం

తపఃస్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్।

నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥

అని ఈ తీరుగా ప్రారంభమై విన్పిస్తోంది.

శ్రీమద్రామాయణాన్ని గ్రంథరూపంగా వ్రాసే అదృష్టాన్ని నోచుకున్న వాల్మీకి మహర్షికి, రామకథని చెప్పడం కోసం ఆనాడు నారదమహర్షి రానేవచ్చాడు. రామకథని చెప్పవలసిందిగా వాల్మీకి ప్రశ్నించబోతున్నాడు. నారదుడు చెప్పబోతున్నాడు కూడ.

ఇక శ్రీమద్ రామాయణం బాలకాండ ప్రారంభం.

శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః

## శ్రీమద్రామాయణ ఫలశ్రుతి

(శ్రీమద్రామాయణాన్ని విన్నా, విన్పించినా, చదివినా, చదివించినా కలిగే ఫలం)

శ్రీమద్రామాయణాన్ని నారదుని ద్వారా విన్న వాల్మీకికి, బ్రహ్మ ప్రోత్సాహంపై సరస్వతి తన నోట ప్రవేశింపగా, రామునికే ఆనంద పాత్రమయ్యేలా తాను వ్రాసిన ఈ శ్రీమద్రామాయణాన్ని విన్నా, విన్పించినా; చదివినా, చదివించినా ; వ్రాసినా, వ్రాయించినా ; కలిగే ఫలాన్ని స్వయంగా తాననుభవించి ఇలా చెప్తున్నాడు వాల్మీకి.

ప్రతి నిత్యం ఋషులు, దేవతలు, గంధర్వులూ ఆనందంతో దీన్ని దేవలోకంలో వింటూంటారు. వేదసమమైన **ఈ రామాయణాన్ని శ్రాద్ధకాలంలో విన్పించడం వలన పితృదేవతలు తరిస్తారు.** పుత్రులులేని వారికి సంతానం, ధనం లేని వారికి సంపదా కల్గుతుంది. మనసుపెట్టి ఒక్క శ్లోకాన్ని చదివినా దోషాలు తొలగుతాయి. ప్రాతః - మధ్యాహ్న - అపరాహ్ణ - సాయంకాల భేదాలు లేక ఎప్పుడైనా చదువదగిన ఈ శ్రీమద్రామాయణ పఠనం, సూర్యగ్రహణ కాలంలో బ్రాహ్మణునికి కనకదానం చేసిన ఫలితాన్నిస్తుంది. అశ్వమేధ - వాజపేయ యాగాలని చేయలేనివారికి తత్ఫలితాన్ని అందిస్తుంది. ప్రయాగ మొదలైన క్షేత్రాలు దర్శించిన ఫలాన్నీ, గంగాదినదీస్నానాలు చేసిన ఫలాన్నీ కూడా ఇస్తుంది.

ఎవరు ఈ గ్రంథాన్ని విన్పిస్తారో వారే కాదు. వారి తండ్రి తాత, ముత్తాత, ఆయన తండ్రి, తాత, ముత్తాత . . . ఇలా వంశ పూర్వీకులు కూడ తరిస్తారు.

భక్త్యా రామస్య యే చేమాం సంహితామ్ ఋషిణా కృతామ్।
లేఖయం తీహ చ నరాః తేషాం వాసః త్రివిష్టపే ।।

**ఇలాంటి పుణ్యప్రదమైన రామకథని ఎవరు వ్రాయిస్తారో, వారూ స్వర్గంలో నిత్యమూ నివసించే అదృష్టానికి నోచుకుంటారు.** చదివిన, విన్న, వ్రాసిన, వ్రాయించిన వారికి విష్ణుబలం చేకూరుతుంది. ఇది సత్యము. ఇది శాశ్వతము. ఇది నిత్యము.

ఓం ఓం ఓం బలం విష్ణోః ప్రవర్ధతామ్ ఓం ఓం ఓం